యంజెప్పెను. పరమానందముతో తిరుపతికి దిరిగివచ్చి యా శ్రీసూర్య నారాయణయ్యగారిని గలసికొంటిని. వారు అన్నమాచార్యచరిత్రమును శ్రీతిరుపతి వేంకటేశ్వరప్రాచ్య విద్యాలయమునకు ఇచ్చినవారు. కడప జిల్లా మడితాడును బీదరికముచే విడనాడి అన్నమాచార్యాదులర్చించిన దేవతావిగ్రహములను సరిగా సర్చింపనవ్వుటకై తిరుపతిలో దేవునిసన్నిధి నర్చింపఁగోరి తెచ్చితిననియు దమపూర్వులు గట్టించిన దేవాలయము పున రుద్ధారము చెంది పూజాపురస్కారములు లభించె యున్నందుకు పరితో షించి యావిగ్రహములనెల్ల నక్కడనర్పించితిననియు వారుచెప్పిరి.

ఆనాఁడెప్పుడో యన్నమాచార్యుఁడు తనదేవతార్చన విగ్రహ ములు పోయినందుకు విలపించిన సంకీర్తనము తలఁపున గోచరించెను. (చూ. 46పుట. పీఠక) నాడాతని కవిమరలదొరకెనేమో దొరకినప్పుడెంత సంతోషించెనో ఏమిచేసెనో తెలియదుగాని యయిదువందలయేండ్ల తర్వాత నాతనిభజనచిరుతలు తాళములు దేవతార్చన విగ్రహములు వెదకఁబోయినతీవ కాలఁదవిలినట్లు నాకన్నులెదుటగానవచ్చుట, వారు వెలయించిన దేవళము పూజా పురస్కారములతో మరలవెలయుట, చూడఁగా నాకుఁ బరమాహ్లాదముగలిగినది. శ్రీయన్నమాచార్యుఁడు నిత్యసూరులతో నారదాది మహర్షులతో నాళ్వారులతోఁగలసి శ్రీ వెంక టేశ్వరస్వామి పుష్కరిణీతీరమున ఆకాశగంగా ఝురులలో దరులలో సూర్యమండలములో నిత్యానంద విహారము సల్పుచుండెనని యానాఁటి వారానందించిరి. (చూ. 75పుట పీఠిక) అన్నమాచార్యుఁడుపరమప్రాప్యము శ్రీవెంకటేశ్వర సన్నిధానమేయని యనేక సంకీర్తనములలో గొంతెత్తి చేయెత్తిగొప్పగాఁజెప్పుకొనెను. ఆయన పరమపదమందిన ఫాల్గున బహుళ ద్వాదశి ప్రత్యాబ్దికశ్రాద్ధదినముగాన యాతని కుమారుఁడు పెద తిరు మలాచార్యుఁడిట్లు తన తండ్రిగారి నాహ్వానించెను.

శ్రీరాగం.

దినము ద్వాదశి నేఁడు తీర్థదివసము నీకు ।
జనకుండ అన్నమాచార్య విచ్చేయవే ॥ పల్లవి ॥

అనంత గరుడముఖ్యు లయిన సూరిజనులతో ।
ఘననారదాది భాగవతులతో ।
దనుజమర్దనుఁడైన దైవశిఖామణితోడ ।
వెనుకొని యారగించ విచ్చేయవే ॥ దిన ॥ 1

వైకుంఠాననుండి యాళువారలలోపలనుండి ।
లోకపు నిత్యముక్తులలోన నుండి ।
శ్రీకాంతతోడనున్న శ్రీవేంకటేశుఁ గూడి ।
ఈకడనారగించ నింటికి విచ్చేయవే ॥ దిన ॥ 2

సంకీర్తనము తోడ సనకాదు లెల్లఁబాడ ।
పొంకపు శ్రీవెంకటాద్రిభూమి నుండి ।
లంకె శ్రీవెంకటగిరి లక్ష్మీవిభుఁడ నీవు ।
అంకెల మాయింటవిందు లారగించవే ॥ దిన ॥ 3

అన్న. అధ్యా. తేకు.

మదరాసువిడిచి శ్రీతిరుపతి వేంకటేశ్వరుల సన్నిధిసేవకావింప వచ్చుటలో నాతోఁ బుట్టికోరిక తాళ్లపాకవారిరచనల నన్నింటిని వెల్లడించుట. ఎంతప్రయత్నించినను నడ్డంకులచే నింకి పోవుచున్న నాసంకల్పవు టూటలు చక్కసాగుట కద నిప్పటికి సమకూడినది. ఇక్కడనున్న తాళ్ల పాకవారి సంకీర్తనముల రాగిరేకు లన్నింటిని స్వాధీనముచేసికొంటిని. అస్మదీయుఁడు నాకుఁ జేదోడుగా ననువర్తించు పరిశోధనకార్యసహాయ విద్వాంసుఁడు చిరంజీవి ఎ.వి.శ్రీనివాసాచార్యుఁడు వేలలెక్క నున్న రాగి



కల్యాణ వెంకటేశ్వరస్వామి



తాళ్లపాకవారి పూజా విగ్రహములు

రేకుల భరము మోయుచు బడలుచున్నను సంకీర్తనముల స్వారస్యా స్వాదనమున శ్రమతీర్చుకొనుచు సర్వపరిశోధన సందర్భములందు జాగరూకుఁడై తోడ్పడుచున్నాఁడు. మిత్రులై డైరెక్టరు శ్రీపరవస్తు వెంకట రామానుజస్వామి, ఎం. ఏ. గారు నాకీకార్య నిర్వాహములో సహాయపడు చున్నారు. దేవస్థానమునఁ బై ముఖ్యాధికారు లిందుకుఁ జాల ముచ్చట పడువారుగా నున్నారు. ఇఁకఁజక్కఁగా దాళ్లపాక సంకీర్తనముల ముద్ర ణము సాగగలదను కొందును. ముద్రితము లయిన సంకీర్తనములఁగొనిం టిని సంగీతసాహిత్యపరిపుష్టులు శ్రీఅనంతకృష్ణశర్మగారు స్వరవిన్యాసము తోఁ బ్రకటించుచున్నారు. ఇట్లిన్నాళ్లకుఁ దాళ్లపాకమహనీయులస్వామి సేవాఫలము పరిపక్వమై సహృదయాస్వాద్య మగుచున్నది. అన్నమా చార్యాదులారా! ఆనందింపుడు! అయిదునందలేండ్లకుఁ బిదప మీయభీ ప్సితము లన్వర్థములుగావలసిన ట్లున్నదిగాఁబోలుసుస్వామియనుగ్రహము!

సీ॥ చెక్కుళ్లఁ జిఱునవ్వు చిందుద్రొక్కెడుతేఁడ !
యేడుకొండవాఁడ ! యేలుకొమ్మ
అలమేలు మంగాంబ చెలికాఁడ ! యడుగడ్డు
దండాలవాఁడ ! మా కండ వగుము
ఆమట ్రమొక్కులస్వామి ! గోవింద గో
వింద సందడివేల్ప ! వందనమ్మ
కలియుగప్రత్యక్షకులదైవమా ! యెల్ల
డెండాలవిహరించువింద ! శరణు

గీ॥ పిండివంటకములు కుండలవండిన
యోరెములును మాత్ర లారగించి
భక్తులకుఁ బ్రసాదపఱుచు మహాభోగి
వరకటాక్ష ! పరమపురుష ! రక్ష !

సీ॥ నిలువుదోపుడు దోచు నెఱదొంగతన మేమి ?
పాపముల్ హరియించు భావ మొక్కొ
వడ్డికాసులఁ గూర్చు వ్యాపార మది యేమి ?
మేలు పెంపొందించు లీల యొక్కొ
తలమీఁది నీలాలఁ దొలఁచిపుచ్చుట యేమి ?
చిక్కులం దెగటార్చు ఫక్కి యొక్కొ
ఏడుకొండలమీఁద వీడాటయేమి ? స
హస్రారవసతిరహస్య మొక్కొ
గీ॥ ఏటివో యిపి పెద్దలనాఁటిమాట.
లీశ్వరుఁడు సర్వభూతసుహృత్తు, సుహృదు
డాపదపహర్త, యనవార్త కలరి యట్టి
వాఁడ వను కన్నెఱిఁగి కొల్చినాఁడ నిన్నె !

శా॥ ఏరీ కోరి మనోజ్ఞపుష్పములు నీ కీయెన్మిదే[1] యంచు నా
త్మారామమ్మునఁ బూవఁజేసితి నహింసాదిప్రసూనంబు లే
నారాధించెద వీనిచే నిను ననంతాళ్వార్లకై ంకర్యపుం.
దీరుల్ గా వని వేఱుచేసెదవె తండ్రీ ! వేంకటాధీశ్వరా !

---

అహింసా ప్రథమం పుష్పం పుష్పమింద్రియనిగ్రహః
క్షాంతిః పుష్పం దయా పుష్పం జ్ఞానం పుష్పమతః పరమ్ ।
సత్యం పుష్పం తపః పుష్పం భావపుష్పమథాష్టమమ్
ఏవమష్టవిధం పుష్పం విష్ణోః ప్రీతికరం పరమ్ ॥

శా॥ దూరంబేల పరంబు నీ విహమునందుఁ భక్తరక్షార్థమ
ర్చారూపంబు ధరించి యుంటివన నిచ్చల్ నిన్ను లోకన్ను చె
న్నారం గాంచెద దేహదేవకులమూలాధారమం దాసహ
ప్రారంభుల్ సుఖసత్వ చిత్కలిత దీపారాధనల్ సేయుచున్ !

చ॥ కరకరపల్కులన్ బిరుసు గల్గినశర్కర నన్నుఁ బాగుగాఁ
గరఁచివారంకొంటివి నిగన్నిగ[illegible]డపాల వీవు ని
ల్వరమున నాకు మార్దవము వచ్చెను నీకు ఘనత్వ మబ్బె ని
ర్వరము రసాయనంబగుటపోలదె యుర్వికిఁ గ్రొత్తకోవగాన్.

వే. ప్రభాకరశాస్త్రి.



# అన్నమాచార్యచరిత్రలో.

## సంస్కరణములు.*

| పుట. | బంతి. | ఉన్నది. | సంస్కరణములు. |
|---|---|---|---|
| 1 | 2 | కాయజుంగన, | జుకన, |
| | 7 | కీర్తినవ | కీర్తనవు |
| 6 | 4 | గావింప | గాసింప |
| | 6 | ఒంటు...యొక, | వంట...వక(వగ ?) |
| | 24, 25 | అరి, పర, | అఱి, పఱ, |
| 10 | 22 | జతు | జోత, |
| 13 | 13, 14 | నెరు, నోర, | నెఱు, నోఱ, |
| | 15, 16 | ముల, | ములు, |
| | 20 | ముద్రికల | ముద్రికలు |
| | 21 | బాణముల్ | (పాదముల్ ?) |
| | 25 | | వనములఁగోనేటివాఁడితిమ్మప్ప<br>పనివిన్న పరుసలవాఁడితిమ్మప్ప |
| 14 | 16 | తలిమేఱు | (తలమేరు ?) |
| 20 | 19 | నడగోపురము, | (నడిగోపురము ?) |
| 24 | 7 | యాగాళ | యాకాళ, |
| 31 | 5 | బాంధవా | (శాత్రవా ?) |
| 34 | 8 | కెంబట్టు<br>కుల్లాయి | కబ్బాయికుల్లాయి ? |
| 43 | 6 | దండనేత్రు | (దండనేతృ ?) |
| 43 | | 17 బంతితర్వాత | 16 బంతి ఉండవలెను |

* 16 పుటలముద్రణమయిన తర్వాత, మూలపువ్రాఁతప్రతిదొరకెను. దానిలోని పాఠభేదములుకొన్ని. ఉన్న పాఠములకు ఊహాసంస్కరణములు కొన్ని.

# అన్నమాచార్య చరిత్రము.

## విషయసూచిక.

శ్రీ

# అన్నమాచార్య చరిత్రము

## అవతరణిక

శ్రీయుల మేల్మంగఁ జిరకృపాపాంగఁ
గాయజుగనతల్లిఁ గాంతామతల్లి
శ్రీవేంకటేశుఁ బోషితపద్మకోశు
సేవకపరతంత్రు జితదైత్యతంత్రు
దనుజకర్శనము మాధవసుదర్శనము
దినకోటితేజంబు హేతిరాజంబు
నరహరిసంకీర్తి నవనిధు లొసగు
పరమోపకృతిఁ దాళ్లపాకాన్నయార్య
నాచారవిజితామరాచార్యుఁ దిరుమ
లాచార్యు ఘను మదీయాచార్యుఁ గొలిచి
యార్యులు విని యన్నమాచార్యవర్య
చర్యకు మిగుల నాశ్చర్యంబుఁ జెంద
జలజాతవాసినిచనుబాలపుష్టిఁ
బలికెద నానేర్చుపరిపాటి నిపుడు
జననపరంపరాశతసహస్రముల
వెనుకకు మేము దుర్విషయానురక్తిఁ
గుక్షింభరుల మైనకొద వెల్లఁ దీఱ

రక్షించి మాయపరాధము ల్మఱచి
యేపుట్టువున మిమ్ము నెఱుఁగఁగఁ జేసి
నీపాలివారిఁగా నియమించి మమ్ము
హరి మిమ్మునే కొనియాడుమా జిహ్వ
నొరులను గొనియాడ కుండఁగఁ జేసి
కంటు లేనట్టిలక్ష్మణగురుమతము
వంటిసన్మతము మీవంటి దైవతము
తనవంటిగురుని నందఱిలోనఁ దెచ్చి
వనజాక్ష నేఁడు మావంటివారలకు
కరతలామలకంబుఁ గావించెఁ గనుక
అరయఁగఁ దాళ్ళపాకాన్నయాచార్యు
పరమోపకార మెప్పటికి డెందమున
వరయుచుఁ గొనియాడు టది యొప్పుగనుక
నాయనఁ జూచి మాయపరాధకోటు
లేమెడఁ దలఁచక యెడఁబాయ కెపుడు
నేయాపదలు మమ్ము నెనయక యుండ
మాయిలువేల్పవై మన్నించుకతన
నందను సద్వర్తనము తండ్రి ప్రియము
నొందఁ గీర్తించుట యుచితంబు గనుక
అరలేక యీయన్నమాచార్యచరిత
వెఱవక నీకు నే విన్నవించెదను
మన్నించి యలమేలుమంగతో నీవు
నిన్నుఁ బాయనిభక్తనికరంబుతోడ
నవధారు శ్రీవేంకటాచలాధీశ
అవధరింపుఁడు గురుహరిభక్తులార

# అన్నమాచార్య చరిత్రము

## పొత్తపినాడు

అనయము నయము సొంపారుక్రొవ్విరుల
గొనబైన చెంగల్వకొలఁకులు చుట్టి
పొదలు గొజ్జంగపూఁబొదలు క్రిక్కిఱిసి
వదలక వెలుఁగుకైవడి వెలుఁగొందు
తెరువరుల్ త్రోవ నేతెంచి యేతెంచి
పొరిపొరిఁ గన్నుఁగన్నునఁ జాలుగారు
రసదాళిచెఱకుతోరపుతుంట లంది
మిసిమైన ముంతమామిడిపండ్లపైన
నారసంబులచేత నచటిరాజనపు
పైరులు ముక్కాఱుఁబండు నెయ్యెడల
పాలనే పెరిగినపసిఁడిటెంకాయ
పాళెల నడసీరు పట్టి పెట్టినను
అనఁటిపండులు మేసి యలసి పైఁ దప్పిఁ
గొనివచ్చి కోవెలల్ గ్రోలు నచ్చటను
నరిమాఱునామేటినాటినాఁటి
సిరు లింక నే మని చెప్పంగవచ్చు

## తాళ్లపాక

అట్టిపొత్తపినాఁటియాఁదల సిరుల
పట్టుఁగొమ్మై తాళ్లపాక చెన్నొందు
అవురిఁ గేశవుం డనురమావిభుఁడు
చేపట్టి జనుల రక్షింపుచునుండ
వరికించియచ్చటి ప్రజలెల్ల మిగుల
నరుదంద మున్నూటయుఱువదినాళ్లు
ఫలములచక్కెర వన పెర్గు లేఁగు

చెలరేగు నావేల్పుచెంత నెంతయును
అఖిలదేవతలకు నది యాటపట్టు
నిఖిలసన్మునులకు నిజనివాసంబు
సిరిగొల్చునవనాథసిద్ధులు మున్న
పరుసంబు రససిద్ధి బడసినచోటు
నళినాళి తులసీవనములు వైష్ణవులు
వెలయుదు రెచ్చోట విష్ణుఁ డెచ్చోట
సన్నిధిసేయు నిచ్చలునంద్రు మహాను
లన్నియు నచ్చోట ననిశంబునుండు
నందు వసించు నయ్యఖిలభూసురులు
నిందిరారమణపదైకమానసులు
అతులితవేదవేదాంగపారగులు
జితసర్వకరణు లంచితతపోధనులు
కనుట గోవిందుమంగళవిగ్రహంబె
వినుట నారాయణవృత్తాంతచయమె
చేయుట కౌస్తుభాంచితపూజె తలఁపు
సేయుట మాధవశ్రీపాదయుగమె
కుడుచుట వనమాలిగొనుప్రసాదంబె
నడచుట నందనందనునగరికినె
కాని దుర్విషయసంగతి కలలోన

అన్నమాచార్యవంశ్యులు

నైనఁ జేయగ నొల్ల రమ్మహామహులు
అందులో నొక్కధరామరేంద్రుండు
నందవరాన్వయార్ణవసుధాకరుఁడు
గురుభరద్వాజసగోత్రుండు పావ

సారబుద్ధి యాశ్వలాయనసూత్రశాలి
నారాయణుం డనునయవేది వేద
పారాయణుఁడు విష్ణుపదభక్తిరతుఁడు
అనఘుని విఠలాహ్వయుఁ గాంచె నతఁడు
కనియె నారాయణు ఘనయశోనిధిని
నతఁడు విఠలుఁ గాంచె నతఁడు లోకైక
నుతుఁడైన నారాయణునితండ్రియయ్యె

నారాయణుఁడు

ఆకొమరుండు నారాయణాహ్వయుఁడు
చక్కఁగాఁ దనవద్దఁ జదువకయున్న
నూటుకూరనుపొరుగూరఁ జుట్టముల
చాటునఁ గొనిపోయి చదువఁజెప్పుటయు
ఆచుట్టములు వేడ్క నయగారియొద్ద
నాచిన్నపాపని నమరించి నిలుపఁ
గొదుకుచు గురుఁడును గొన్నాళ్లు తోడఁ
జదివెడుపడుచులచందంబు చూచి
సామంబుచేతను చదివించి చూచి
యామీఁదఁగొన్నినాళ్లదలించి చూచి
మఱికొన్నిదినములు మైనొత్తిచెప్పి
వెఱపారఁ దఱటున వేయించి చూచి
నూఱుమాటలు చెప్పి నులిపెట్టి చెక్క
నూఱిపోసినఁగాని నుడుగు నోరికిని
రాకున్న నిదియెట్టురా గొంటు వీని
పోకలఁ జూడ నబ్బురమయ్యె నాకు
వని రొక్కనాఁడు చిట్టదలించి తిట్టె

మొనసినకోదండమున ద్రోలవేసి
కోలగగ్గరఁ ద్రోసి గుంజిళ్ళఁ బెట్టి
పై పాపు దొరుగంగ బటిపెట్టు పెట్టి
ఊఁబాగు గావింప నెపరుమాటాడఁ
బాలక కన్నీరు జార బాలకుఁడు
ఒంటు సేసెద నని యొకకొంతసేపు
నింటివారలఁ జూచి యిటు కొంతసేపు
గడపుచు నందును గడతేరకున్న
బడిబడి పెట్లను బడి చాల బడలి
ఆయూర నొక చింతల మ్మనుశక్తి
పాదపునిగుడిఁ దాచుఁబాముండు ననుచు
జనులెల్లఁ జెప్పి యాశ్చర్యంబు నొంద
వినుకకుఁ దా నది వినియుండెఁ గనుక
కలిగనీ నాబాధకంటె నాపాము
కలిచిననెగు లెల్లఁ గడ కేఁగుననుచు
కోపంబుతోడ నాగుడిలోని కరిగి
ఆపుట్టలోఁ దనహస్తంబు నిడిన
దేవి త్రికాలవేదిని గాన శిశువు
భావించి తోడ రూపమున నేతెంచి
బాలక కాలసర్పము సొచ్చుపుట్ట
నేల కేలిడితి వింతేల వచ్చితివి
అనుచు నారాయణుఁ డనుబాలకుండు
కనుదోయి కన్నీరు గదుర నిట్లనియె
అరిముఱిఁ జదువురా దని యయ్యవారు
వరచునాపాటులఁ బడ నోప కేను

అలసివచ్చితి నిట కన్న నద్దేవి
వలవదు నీ కేల వగపు నాతండ్రి
గొనబుమీఱిన పలుకులఁగోటిమాను
జనమేజయునకుఁ బ్రసన్నుఁడై నాఁడు
ఆశంకరాదులు నతని వేఁడుదురు
కేశవుం డాశ్రితక్లేశనాశకుఁడు
మీతాళ్లపాకలో మెఱయుచునుండు
నాతామరసనేత్రు నాలయంబునకు
వలనుట్టి మ్రొక్కు మవ్వలి వానికరుణ
నలరుచు సకలవిద్యలు నీకువచ్చు
అదియునుఁ గాక మూఁడవతరంబునను
వదలనికీర్తి మీవంశంబునందు
పరమభాగవతుఁడు ప్రభవించు శౌరి
వరమున జగదేకవల్లభుం డనుచు
అనుచు నంతర్హితయైన నాపాపఁ
డనయంబు హర్షించి యటకు దండికొనుచు
ఆతాళ్లపాకకు నరిగి వేవేగ
జాతరూపాంశుఁ గేశవుఁ గాంచి మ్రొక్కి
స్వామిగేహములకు వలచుట్టి కేలు
దామరల్ మొగిచి యుత్రతి శరణొంది
స్వామి కేశవ సరస్వతిమాను విద్య
తామసింపక నాకు దయసేయు మనుచు
ఆమాధవునికృప నంబుజాసనుని
భామ యాతనిజిహ్వపైఁ బాదుకొనియె
నరగున మఱునాఁడు సని యచ్చకుండు

గురునకు మ్రొక్కి మక్కువఁ దనతోడఁ
జదివెడువడుచు లాచార్యుండు శాస్త్ర
విదులును జూచి నివ్వెఱఁ గంది పొగడ
పంచినచో నెల్లఁ బదములు గ్రమము
కొంచించ కతఁడు గ్రక్కునఁ జెప్పి మఱియు
క్రమశిఖ జటయు వర్ణక్రమసరణి
బ్రమయక నిజవేదపాఠంబు సలిపి
కడమవిద్యలయందుఁ గడు నేర్పు గలిగి
కడక వారలమెచ్చు గైకొని వచ్చి
జగతి నందఱుఁ జూచి సర్వజ్ఞుఁ డనఁగ
మిగుల వాక్ప్రౌఢిమ మెఱయుచు నుండె

నారాయణసూరి

అతఁడు గనియె నారాయణసూరి
నాతతసకలవిద్యాధురంధరుని
నామహాత్ముఁడు లక్కమాం బనుపేరి
భామినీరత్నంబుఁ బరిణయం బయ్యె
ఆకల్పకములాక యగుతాళ్లపాక
యాకడఁగడలేని యభినవశ్రీల
మాడుపూరనునూర మాధవమూర్తి
తోడుసిద్ధై యాపెతో మాటలాడు
నాలక్కమాంబతో నాసూరివరుఁడు
మేలిఫంపదల నర్మిలిఁ దెప్పదేలి
కటపట వేవురు గలుగంగ నేమి
కొడు కొక్కరుం డైనఁ గుల ముద్ధరించు
తనయుండు గల్గినఁ దనపుట్టు వెల్ల

ననయంబు సఫలమౌనని యిటువంటి
తనయులు లేమి నెంతయుఁ జింతనొంది
మన మింక నేవేల్పుమఱుఁగుఁ జొచ్చెదము
అడిగినయపుడె యిష్టార్థంబు లెల్ల
నెడపక చేసేత నియనోపువేల్పు
గలఁడె లోకమున వేంకటభర్తదక్క
నలమేలు బలువేలుఁ పైయుండు మనకు
మనకేల వలవనిమనికేతం బనుచు
చనుదెంచి వేంకటస్వామిసన్నిధికి
దండిమై గారుడస్తంభంబుదండ
దండంబు లిడుచు సంతానంబు వేఁడ
వరదుఁడై వెంకటేశ్వరుఁడు తాఁబూను
బిరుదుగజ్జియల ముప్పిడికటారంబు
కలలోన నొసగ నక్కజ మంది తపము
ఫలియించె ననుచు దంపతు లేఁగి రంత

## అన్నమయ జననము

రాజీవనయను వరప్రసాదమునఁ
దేజంబు మఱియు నెంతే విస్తరిల్ల
లక్కమాంబకుఁ బుణ్యలావణ్యనిధికి
చక్కనిగ్రహము లుచ్చమున మూఁడలఁ
అనుపమలగ్నంబు నందు వైశాఖ
మున విశాఖను జగంబున నుల్లసిల్ల
జనియించె నన్నమాచార్యుండు శక్తి
మునికిఁ బరాశరమునిపుట్టినటులు
జనకుఁడు కారణజన్ముఁ డైనట్టి

తనయున కాగమోక్తప్రకారమున
జాతకర్మము చేసి సకలవేదాంత
జాతచోదితమునై జలజోదరునకు
నామమై వినఁ బరిణామమై మున్ను.
హేమాంబరుం డానతిచ్చినయట్టి
అన్నమయ్యాహ్వయం బతనికి నొసగె

## అన్నమయ బాల్యము

వన్నినభక్తి నావసిబిడ్డఁ జూచి
అన్నయ్య అన్నప్ప అన్నమాచార్య
అన్న ర మ్మనుచు ముద్దాడుచునుండ
హరి నందకాంశజుం డగుట డెందమున
పరమసుజ్ఞానసంపద పొదలంగఁ
బుట్టుచు నతఁడు నేర్పునఁ దల్లి బిడ్డ
పెట్ట రమ్మని యుగ్గు పెట్టఁ బోయినను
పనిఁబూని తిరుమలప్పనిప్రసాదంబు
గొనుమని యనక లోఁగొనఁడు కేరుచును
నెడపక తొట్టెలో నిడి యెంతపాటు
పడి యెంతవడి జోలఁ బాడనేనియును
వేంకటపతిపేరు వివరించి పాట
పొంకించకుండినఁ బోరూరడిలఁడు
కొండలప్పనికి మ్రొక్కు మటంచు నసక
యొండులాగుల [illegible] తొనరించఁ [illegible]
[illegible] శేషశైలేంద్రుని [illegible]
[illegible]

## అన్నమయ విద్యలు

ఏంతరైయె యంతరైయె యీడేటి బుద్ధి
మంతుఁడై పంచసమంబు లైనంత
నియతిమై గురుఁ డుపనీతుఁ గావించి
నయవేది నధ్యయంబు సేయించె
నన్నమాచార్యున కహినాయకాద్రి
వెన్నునివరముచే విద్యలన్నియును
నమితంబులగుచు జిహ్వాగ్రరంగసీమ
తముఁ దామె సొచ్చి న ర్తన మాడఁదొడఁగె
నాపిన్నప్రాయంబునందు నామేటి
యేపారఁ దనమది కిచ్చయైనట్లు
ఆడినమాటెల్ల నమృతకావ్యముగ
పాడినపాటెల్లఁ బరమగానముగ
తనకవిత్వమునకుఁ దనగానమునకుఁ
గనుఁగొని సకలలోకములు గీర్తింప
వేంకటపతిమీఁద వింతవింతలుగ
సంకీర్తనంబులు సవరించు నిచ్చ
అసమాననిజరేఖ యాత్మఁ గీలించి
వసుధ నటించుసంవర్తుభావమున

## అన్నమయ తిరుమలయాత్ర

నింటివారలు పిల్చి యేమి చెప్పినను
గెంట నాడక పరికించి సేయుచును
జననియు నన్నయు జనకుండు వదినె
యును గొన్నిపనులు సేయుచుఁ దన్నుఁ బిలిచి

వసులకు కనవుఁ దేఁ బనుప బాలుండు
వెసనేఁగి వాఁడిలవిత్రంబు పూని
మరకతాఁకూరకోమలభర్మరుచులఁ
గరమొప్పు పచ్చనిగఱిక వీక్షించి
పాపవల్లరుల శ్రీపతినామహేతి
నేపారఁ దఱుగు యోగీంద్రుచందమున
కసిమస నొకపిడికెఁడు గోసి మఱియు
గనవు గోయఁగ బోయి కడవ్రేలుసోకి
వడియునెత్తురు సూచి వాక్రుచ్చి శౌరి
యడుగులు దలఁచి శ్రీహరి హరీ యనుచు
నీకోఁతకోలఁది నాదెఱిఁగిన వదిన
చేకోఁత పడఁగాదు చీరోఁత యనుచు
హరి చరాచరదేహి యని పెద్ద లనఁగ
నిరవొంద నెఱిఁగియు నిటుసేయఁ దగునె
చిడిముడి నేమి చేసెద నంచుచేతి
కొడవలి నేల గ్రక్కునఁ బాఱవైచె
నెన్నటిచుట్టంబు లిటువంటివార
లెన్నటిబంధుండ నేను వారలకు
నీవట్టివెఱ్ఱి నా కేల కావింప
భావింప నాలోనఁ బాయ కెల్లపుడు
తల్లియుఁ దండ్రియు దైవంబు గురువు
నెల్లసంపదలు నై యెల్లచందముల
ననుబ్రోచు శేషాద్రినాథునిఁ గొలిచి
మనియెద ననుచు నెమ్మది పాదుపఱిచి
నలుదెసల్ పరికించి నానావిధముల

విలసిల్లు శ్రీరాగ వెల్లువల్ వోలె
దండెలు శ్రుతి గూడి తాళసంగతుల
దండిమద్దెలలు బిత్తరముగా మ్రుట్ట
నానందబాష్పము లడర నాగతుల
నానందనందను నంకించి పాడి
తన్మయు లగుచుఁ జిత్రపునాట్యగతులఁ
జిన్మయునందు నే చిక్కఁ జొక్కుచును
సనకాదు లనుపేరఁ జనుదెంచు వారి
ననుపదంబు నిదిమహాశ్లోకమనుచు
గోవింద గోవింద గోవింద యనుచు
నావరుసనె నరహరి హరీ యనుచు
తిరుమల ప్పను నాదుదీరకెమున్న
వరములప్పని మ్రొక్కి వర్ణించువారి
నెరులందు రంగువన్నెలు పిసాళించు
నోరపై ననిడుదమయూరకంఠముల
నటియించుకృష్ణాజినపుఁగిరీటముల
బటువైన బేగడపారుటాకులును
కీలికుచ్చులఁ జెక్కుఁబెట్టినదిండ్లు
ఫాలరేఖల నిండుపట్టెనామములు
ఘనమైనశంఖచక్రములముద్రికల
పనుపడ దేవరబాణముల్ పూని
కోనేటిరాయఁడె కొండలవాఁడె
కానికరూకలఁ గనఁజాలువాఁడె
వరుసబంగరుమేడవాఁడె తిమ్మప్ప
వరములరాయఁడె వాఁడె తిమ్మప్ప

గొడ్డురాలికినైనఁ గొమరుల నొసగి
వడ్డికాసులఁ గొనువాఁడె తిమ్మప్ప
అనుచుఁ జేరెమువారి యడుగుల నిడిన
దినుసైనకంచుటందియలు సారెకును
ఘల్లుఘల్లునపాతకములగుండియలు
ఝల్లుఝల్లను విలాసములును మెఱయఁ
గరములబాణిగెలఁ గడురమ్యముగను
పరిమజ్జనంబుల మజ్జనేఁగుచును
ముక్తిదాయకపురములు నేడుచూడ
యుక్తివేంకటగిరియొద్దనున్నట్టి
పల్లెలో గొల్లలపాలింటిశక్తి
నల్లారునని మును లనిశంబుఁ బొగడ
గనుపట్టునట్టి యాగ్రామంపుశక్తిఁ
గనుఁగొని బహునమస్కారముల్ జేసి
అళిపుళిసింగరి నర్చించి మ్రొక్కి
తలియేఱుగుండు సందర్శించి కదలి
పెద్ద లెక్కుడుగాఁగఁ జేరొక్కనుచుండు
పెద్దయెక్కుడు గూర్మి పెనఁగొన. నెక్కి
కపురంపుఁదావులు గడునాలుకొలుపు
గపురంపుఁగాలువఁ గడచి యంతంత
నామహాచలవీథి నలరారుపుణ్య
భూమిజంబులఁ బుణ్యభూముల జనుల
పావననదుల శోభనవస్తుతతుల
సేవించి కొనుచు మచ్చికవచ్చివచ్చి
వేకువజామున వెడలి జా మెక్కు

దాఁక మిక్కిలి యెండదాఁకంగ నడిచి
యెన్నఁడుతల్లిప క్కఁడసిరియొండెడల
నున్నట్టివాఁడు కాకుండుటవలన
కడపవాకిలిదాటికడయిండ్ల కడకు
నడచుట మునుపు నెన్నఁడు లేదుగనుక
నాఁకట నసురుసురై బాలకుండు
మోఁకాళ్ల ముడుపు నిమ్మలఁ జేరవచ్చి
కమ్మని గణుపు చెంగట వాటమైన
తుమ్మెదతోలుల సందుల చల్లగాలి
రాణ దూరగ వింతరాగంబు పొసగ
వేణునాదముసేయు వెన్నుఁడో యనఁగ
పరువంపుఁదలిరుజొంపములఁ బెంపొలయు
మరకతశ్యామనిర్మలనిజాకృతుల
నెదురుచల్లనితావు లెసగించు వెదురు
పొదక్రిందఁగూర్చుండి పొలయు లేఁ జెమటఁ
దొడిగినచెవ్వాలతోడనే మిగుల
బడలిక నొకరాతిపై శయనింప

## అన్నమయకు దేవి ప్రత్యక్షమగుట

నితరు లెవ్వరియాత్మ లెఱుఁగనియట్టి
యతనియాఁకలి జగదంబ తా నెఱిఁగి
యలమేలుమంగ తియ్యమునెయ్యి మెసగ
బలుచన్నఁగవతుదఁ బాలు చిప్పిలగ
మినుకారుక్రొక్కారు మెఱుఁగు చందమున
ఘనపయోధరములఁ గదుఁ జాఁడుఁగలిగి

దిన్నసై నలేవువ్వుఁదీగకై వడిని
మెనసినబలుమొల్లమొగడలఁ దనరి
పసుపైన రాచిల్కభాతిఁజక్కెరలు
గొనరెడుపల్కులగొనబుచూపుచును
విరివింటివానిచే వెడవింటినారి
దొరసినిక్కనకొప్పుతో నొప్పుమీఱి
కమనీయమగుచంద్రకళసోయగమున
నమృతాధరస్థలి నలరి చూపట్టి
కులుకుతావులతమ్మికోలనిభావమున
పొలుచుహంసకనాదములు బిడారించ
పెద్దముత్తైదువ పేర్మితో బాలు
నొద్దకు నేతెంచి యూరడింపుచును
పడుచ యేమిటికి కిటఁబడియున్నవాఁడ
వదలక లేచి రమ్మన్న నా శిశువు
బైకొన్నయాకలి బలుదప్పి నడచి
రాకఁ గన్నులు గానరావు మాయమ్మ
అందుః కొకయుపాయముఁ జెప్పి నాకు
గందర్పజనకునిఁ గనఁజేయు మమ్మ
యనవుడు కమలామహాదేవి శిశువు
దనకృపామృతధారఁ దనివి నొందించి
బాలక యామహాపర్వతేంద్రంబు
లాలితసకలనాల్గ్రామమయము
ఘనులకు నిది చెప్పఁగాళ్ల నెక్కంగఁ
జనదు నీచెప్పులు సడలించి వైచి
కనుఁగొను కన్నులఁ గనువచ్చుఁ జనిన

విని బాలుఁడట్లు కావింతు నే ననుచు
గ్రక్కునఁ బాదరక్షలు దీసివైచి
యక్కొండ గనుఁ గొనునపుడు గన్నులకు
వనమాలికలచే సువర్ణరేఖలను
గనుపట్టుగొనవెండ్రుకలకురంగముల
వేణుబాణాసనవితతచక్రముల
రాణించి ధరణి వరాహవైఖరుల
నారమానారాయణాకృతి గలిగి
శ్రీరామకృష్ణలక్ష్మీనృసింహాది
మూర్తులన్నియు నొక్కమొత్తమైనట్లు
వర్తింపుచున్న నావడువు వీక్షించి
మహితసాలగ్రామమయ మానటంచు
బహువిస్మయము బొంది ప్రణతులొనర్చి
యాజగజ్జననికి నభివాదనంబు
లోజఁ గావింప నయ్యువతీలలామ
శౌరియుఁ దాను సిచ్చలు పొత్తు గలసి
యారగించిన ప్రసాదాన్నముల్ దెచ్చి
పరిపరిరుచుల నేర్పడ సేదదేర
పెరిమతో భుజియింపఁ బెట్టి యూరార్చి
తిరుమలప్పని దేవదేవునిఁ గొలువ
నరుగు మటంచు నయ్యరవిందవదన
తొల్లింటికరణి కౌస్తుభరత్నహారు
నుల్లంబుమీఁదట నుండె నుండుటయు
శ్రీమూర్తులందుల చిహ్నంబు లివుడు
నామహాచలశిల లందు నింపొందు

## అన్నమయ దేవిపై శతకము చెప్పుట

నత్తతి నలుదిక్కు లరసి యాశిశువు
చిత్తంబులోన నచ్చెరు వందుకొనుచు
కలయొ యాందోళమొ కాక నిక్కంబొ
కలవళంబొ దీనికరణి యేకరణి
యని నిక్కమని యాత్మ నలరి యాపద్మ
తనకేల నిడుప్రసాదప్రభావమున
పరమసారస్వతపారీణుఁ డగుచు
సరసకవిత్వవాచాప్రౌఢి మెఱసి
యలమేలుమంగకు నాశుమార్గమున
సలలితంబుగ నొక్క శతకంబుఁ జెప్పె

## అన్నమయ కొండపై దివ్యస్థలముల దర్శించుట

నానావిధావనోన్నతమైనట్టి
కోనేటి గడ తెంచి గురుపుణ్యవారి
కోనేటిదా నేటికొన్న మన్ననల
నీనేరు పరు దని యెల్లలోకములు
వినుతించునాతీర్థవిభుని సేవించి
చను దెంచి యటకృతస్నానుఁడై యతఁడు
సేవంతిపూనీటిసెలయేటివఱుత
తావితామరలనిద్దంపుఁబుప్పొళ్ల
ముగ్గుల పరుసల మురిపెంబుచేత
నగ్గలంబై పొంగు నంబుపూరములు
పెనుసోబనాలుచూపెడుసోబనాలు
గనుపట్టుస్వామిపుష్కరిణిసోయగము



వరాహస్వామి.

వెండియుఁ జూచె సవిస్మయుం డగుచు
పుండరీకముల యొప్పుల కన్ను లయ్యొ
నురగేంద్రుశిరసుపై నొకపాదమూఁది
చరణ మొక్కటి రసాస్థలి మోవఁ జాఁచి
డాకేలు పుడమి పడంతుక నలమి
యాకేలు కటినూఁది యనురక్తిఁ జక్కఁ
బంటువలంతిగుబ్బలతావి మోవి
పంటిచేనియ లొకపరి యాను తమిని
మోముదామరఁ జూచి మొగసిరి కేలి
తామరలనుశ్రుతిద్వయము నిక్కించి
సంకుచక్రములహ స్తమ్ముల రెంటఁ
బూంకించు కరుణ చూపుల జొబ్బిలంగ
నాదరిఁ బెంపొందునాదివరాహు
నాదరంబునఁ గొనియాడి సేవించి
వలచుట్టుకొని వచ్చి వచ్చి కుందనపుఁ
బొలుపుల పెద్దగోపురము సేవించి
తరగనిఫలపుష్పతతితోడ నీడ
తిరుగనిచింత వర్తిల నమ్రుఁడగుచు
పరుసల కిష్టసంపద లిచ్చుపసిఁడి
గరుడగంభము పేర్మి గని సాగి మ్రొక్కి
కారుమించులకును గలరీతి ముద్దు
గారుపువ్వులు నొత్తుగాఁ బడి రాల
రమణబ్రహ్మాండకరండ మంతయును
ఘుమఘుమతావులు గులికి వాసింపఁ
గనుపట్టు[illegible]నందక ప్రబద్ధ[illegible]ము

చనుదెంచి స్వామిపుష్కరిణిఁ బూజించి
తిమ్మప్పనికి నివేదితమైన మీఁద
బమ్మి యమ్మెడుపైఁడిపళ్లెరంబులును
వారకయమృతంపువారలు వట్టు
నూరివారలకు నో రూరించుచవుల
పరికరంబులచేతపడిఁ గదంబించు
పరిపరివిధముల భక్ష్యభోజ్యములు
వెన్నగాచిననేఁతివింతవచ్చళ్లు
సన్నరాజనపుఁ బ్రసాదంబుతోడ
పెన్నలగుజ్జుపర్వినవన్ననున్న
యున్నతంబైనదధ్యోదనంబులును
అతిరసం బగు వడ లప్పాలు పాలు
అతిరసంబులు మొదలగు ప్రసాదములు
పచ్చకప్రపుఁగలపంబు కుంకుమము
పచ్చకస్తురి సరినాటుగాఁజేసి
తిగిచి పన్నీట మేదించి కుందనపుఁ
బిగువుచూపుచునున్న భృంగారుకలును
కమ్మగా వాసనల్ క్రమ్మఁగాఁ జిత్త
రమ్మగునడగోపురమ్ము సొత్తెంచి
దండడి నవ్వేల్పుతళిఘులక్రిందఁ
జిందఁగాఁ జేత నూర్చిన నంటివచ్చు
నొకనాఁటినెయ్యి వేఱొకదేవళమున
నొకయేట నైనను నున్నదే యనుచు
తలయూఁచి మెచ్చుచుఁ దనలోన తాను
పలుమారు నాశ్చర్యపడుచు నాపడుచు

# అన్నమాచార్య చరిత్రము

శ్రీనివాసుని నమస్కృతి చేసి దండ
గానుపించినభాష్యకారులఁ బొగడి
శ్రీనరసింహునిసేవ గావించి
దానవాంతకు జనార్దను సన్నుతించి
అలమేలుమంగకు నభివందనములు
సలిపి వెంగటి యోగశాలఁ గీర్తించి
మెఱుఁగులు గప్పఁ గ్రమ్మినభాతిరుచుల
నెఱయించు నానందనిలయంబు గాంచి
మరుగురుకల్యాణమంటపంబునకు
కరములు మొగిచి వెంగటితేజి కెఱఁగి
బంగారుగరుడుని భజియించి చెంత
సింగారమైయున్న శేషునిఁ గొలిచి
వాసన నలుదెసల్ వలగొన రాశి
పోసియుండెడు గోనవునుఁగుచట్టలును
గట్టిబంగరుసలాకలఁ గ్రుచ్చి కాచి
తట్టుపునుంగు లత్తఱి నొత్తువిధము
వసిఁడివళ్లెరమునఁ బసనిచక్కెరలు
గొసరి గోవింద ముకుంద తిమ్మప్ప
అనిపరుసలవార లంతంతఁ జేరఁ
జను దేర వేంకటశైలభర్తకును
గుట్టున మది మ్రొక్కుకోర్గా కానుకలు
పెట్టరో దండముల్ పెట్టరో యిపుడె
కోరినకోర్కె చేకూరు నటంచు
నేరుపుపంచవన్నెయచిలుకలును
కనకభూషణవస్త్రధనవస్తుతతుల

మొనసినబండారమును చేరకొనుచు
తడబడఁ జుట్టినతనపంచకొంగు
కడనున్న దొకకాసు కానుకవెట్టి

## అన్నమయ స్వామిని దర్శించుట

బంగారుగాదెలపజ్జ సాష్టాంగ
మంగవింపుచుఁ బులకాంకితుఁ డగుచు
గ్రక్కున దగ్గఱఁ గనుపట్టుపసిఁడి
టక్కులతలవాకిటను గాన వచ్చు
ధళధళల్ తులకించుదరచక్రహస్త
ములు బొడ్డుమానికమును గటారమును
మంజీరకింకిణీమంజులపాద
కంజద్వయంబును గాంచనాంబరము
కటిమీఁదఁ జేర్చినకరపంకజంబు
తటుకునవరమిచ్చుతమ్మికెంగేలు
కులికెడుమణిమయకుండలద్యుతులు
కలకల నగు ముద్దు గారు నెమ్మొగము
మంచిముత్యాలనామంబుపైఁ గాను
పించురత్నాంశుదీపితకిరీటంబు
తట్టుపునుంగుపూఁతయుఁ గిరీటాది
చుట్టినచెంగల్వచొళ్లెంపుదండ
వనమాలికయును శ్రీవత్సకౌస్తుభము
అనుపమదివ్యభూషాదివైఖరులు
గలిగినదివ్యమంగళవిగ్రహంబు
గలయంగఁ గన్నులకఱ వెల్లఁ దీఱ

సేవించి తనివోక శ్రీవెంకటేశు
దేవుని మఱియుఁ గీర్తింపంగఁ దొణఁగె
కంటి నయ్యఖిలాండకర్త నే నధిపుఁ
గంటి నాయఘము నిక్కము వీడుకొంటి
పావనంబైనపాపవినాశనమ్ము
కోవిదుల్ కొనియాడు కోనేఱు గంటి
నావంటిదీనువిన్నప ముద్ధరించు
శ్రీవేంకటేశ్వరు సేవించఁ గంటి
అనునర్థ మలవడ నాదేవునెదుట
ననువుగా సంకీర్తనంబులు సేయ
తనుఁ జూచి యచట నందఱు మెచ్చి మెచ్చి
చనవిచ్చి తీర్థప్రసాదంబు లిడుచు
ఎదఁజేర్చి శఠగోప మిడుచు దీవింపఁ
దదనుజ్ఞ నొకవిడిదల కేఁగె నంత
ప్రాయ మెక్కుచు విష్ణుపదపల్లవంబు
చాయచాయల నెఱసంజ చూపట్టె
నలకలానిధి భక్తి కారాత్రి మేను
పులకించె నన మింటఁ బొడమెఁ దారకలు
గగనాచ్యుతుఁడు సుధాకలశంబుగొన్న
పగిదిఁ జందురుఁడు చూపట్టె నెంతయును
అరయ నన్నయగురు ననురక్తి బెరయు
హరిబింబమో యనిహరిబింబ మలరె
హరిచరణస్మరణాసక్తుఁ డగుచు
హరివాసరంబైన యమ్మఱునాఁడు
ఈరీతి నాలుగేఁడులపిన్న

బాలుఁడయ్యును నిష్ఠఁ బనిఁబూని యతఁడు
దైత్యదారకుఁగొంతు దఱిగినబ్రహ్మ
హత్య సేనానిఁ బాయఁగఁ జేయునట్టి
కొమరధారను దేవకులములు గొలుచు
సమరతీర్థమున నయ్యంజనాదేవి
కనకాంబరుని మెచ్చఁ గను పనిమంతు
హనుమంతుఁ గాంచిన యాగాశగంగ
సారెకు జనులదోసములు నీరగుచుఁ
బారి పోఁజేయుపాపవినాశనమున
బార్థుకోరిక లిచ్చుపాండవనామ
తీర్థంబు మొదలైన దేవతీర్థముల

## అన్నయమయ స్వామిపై శతకములు చెప్పుట

నవగాహనము చేసి యాతేటనీట
ధవళంబుగా మును దాఁ గట్టు చీర
నుదికి యారగవైచి యొకరాతిదండ
నది యెండ నారెడునంతలోపలనె
వితతవృత్తంబుల వెంకటపతికి
శతకంబు కుతుకంబు సమకూరఁ జేసి
పదిరెండు నామముల్ బాగుగాఁ దీర్చి
సదమలాచారుఁడై చనుదెంచి యతఁడు
వరుసతో మాదిపరివారంబుఁ గొలిచి
మరుగురుద్వారసీమకు వచ్చి మ్రొక్క
నలవేంకటేశ్వరునపరంజితగడు
తలుపులు బిగముల్ దాఁచి యున్నెడను

వేంకటపతిమీఁద వివరస్తవముగ
వేంకటశతకంబు విన్నవించుటయు

## వైఖానసార్చకు లన్నయమహిమ గుర్తించుట

గాలంపుఁజిక్కులు గదియించునట్టి
తాళముల్ వీడియుఁ దనుదా నె వడిన
అలతలుపులు పెళ్పెళన తెఱచుటయు
నలరుచు నర్చకుం డరుదెంచి చూచి
భళిభళి యనుచు నబ్బాలకు మెచ్చి
యలదేవుమహిమకు నాశ్చర్య మొంది
గురుభక్తి నతనిఁ దోడ్కొనిపోయి చెంత
గరుడసేనేశులఁ గపిరాజముఖుల
జనకజాసౌమిత్రిసహితు రాఘవునిఁ
గనుపించుకొని నమస్కారముల్ చేసి
ముందరనే జగన్మోహనాకారుఁ
బొందినపసిఁడిసొమ్ముల నిమ్ముగొనుచు
కారుమెఱుంగుతీగలుచుట్టు నిలుపు
ధారాధరంబుచందముఁ జూపువాని
పంచాస్త్రకోటిసంపదఁ జక్రసహిత
పంచబేరాకృతి బాగైనవాని
శ్రీవేంకటేశు నాశ్రితకల్పకంబు
సేవించి వినతుఁడై చేతులు మొగిచి
బహుళాంగరంగవైభవములతోడ
మహితచందనపుష్పమాల్యవైఖరుల
దూపనీరాజనాదులతోడ వెది

కోపచారముల నాయుర్వీధరునకు
మురవైరి రెండవమూర్తియో యనఁగఁ
గరమొప్పుచున్న వైఖానసోత్తముఁడు
నంబి చెంగటఁ బూజనము సేయుతఱిని
పంబినభక్తి నబ్బాలుండు మఱియు
వేంకటప్పకు విన్నవించినతొంటి
వెంకటశతకంబు విన్నవించుటయు
పెట్టినముత్యాలపే రాయశోద
పట్టి పాదములపైఁ బడఁ బ్రసాదించె
నది చూచి యర్చకుం డరు దంది వచ్చి
ముదమున శఠగోపమును బ్రసాదించి
యీయన్న బాలుఁడే యన్నఁ గోనేటి
రాయనిదివ్యవరప్రసాదుండు
కాకున్న నీనవ్యకావ్యంబు సేయఁ
జేకూరు నెట్టు చరిత్రింపంగ ననుచు
నఁదఱు విన బాలు నాదరింపుచును
జందనతీర్థప్రసాదంబు లొసగ
జేకొని బాలుండు శిరసావహించి
దాకొని కోనేటిదరి భుజియించి
యాదివరాహుగేహమున సుఖించి
ద్వాదశినాఁడు నాథవళాక్షుఁ గొలిచి
దేవునియా పెద్దతిరువీథి వెంటఁ
గోవెల వలచుట్టుకొని యేఁగియేఁగి
సారెసారెకు రాగసంగతి గదుర
నారాయణస్మరణంబు సేయుచును

నకలంకమై చల్లనై చూడఁ దగిన
యొకపంచతిన్నెపై నుండె నుండుటయు

## అన్నమయకు వైష్ణవయతిచే పంచసంస్కారములు

పాయనితనమీఁదిపరమానురక్తిఁ
దోయజాక్షుం డలతొలినాఁటిరాత్రి
ననఘుండు హరిప...యణచిత్తుఁడైన
ఘనవిష్ణుఁ డనుమానికలలోన వచ్చి
దయమీఱ నిట్లనుఁ దాళ్లపాకాన్న
మయనాముకుండైన మద్భక్తుఁ డొకఁడు
వడుగు నల్లనిచిన్నవాఁడు న న్నెపుడు
నడుఁకక సంకీర్తనముసేయు నెపుడు
ముద్దుగారెడువాఁడు మోహనంబైన
మద్దికాయలవాఁడు మనవాఁడె వాఁడు
గుదిగొన్న నునుపట్టుకుచ్చులదండె
ముదమున నిజభుజంబున నించువాఁడు
కడవేగ రేపు నీకడ కేఁగుదెంచుఁ
దడయక నీవు ముద్రాధారణంబు
గావింపు నామాటగా వాని కనుచు
దేవుఁడు తనదుముద్రిక లిచ్చె నంత
యతి మేలుకొని యరు దంది గోవిందు
సతమైనభక్తవాత్సల్యంబుఁ బొగడి
యటిమీఁటి సూర్యోదయంబున కెల్ల
మఱువక నిత్యకర్మంబులు దీర్చి
కరమున శంఖచక్రపుముద్ర లంది

హరియాజ్ఞ వాఁకిటి కరుదెంచి నిలిచి
కేళిమై వెన్నునిఁ గీర్తింపుచున్న
బాలునిరూపు తప్పక విలోకించి
యెఱుఁగఁగా హరియానతిచ్చినయట్టి
గుఱుతు లన్నియుఁ దొరకొన సంతసమున
నన్న నీపే రేమి యనిన నావడుగు
నన్నయ నానామ మని సాగి మ్రొక్కి
వినుతింపఁ జూచి సవిస్మయుం డగుచు
మునినాథుఁ డాతనిముద్దుసేయుచును
తనచేత నీవు ముద్రాధారణంబు
గానకొని సేయించుకొనఁగ నోపుదువె
యన విని శిశువు కృతార్థుండనైతి
నన విని వేదమార్గానుసారమున
నాతని శంఖచక్రాంకితుఁ జేసి
రీతిగాఁ బంచసంస్కృతులు గావించి
శ్రీనాథుఁ డానతిచ్చినప్రకారంబు
తాను వైష్ణవులు నాతఁడు భుజియించి
తనకలగన్నయంతయుఁ దేటపఱచి

(గ్రంథపాతము)

వేద్యంబులగు వేదవేదాంతముఖ్య
విద్యల నధికులై వెలసియుండుదురు
తెల్లంబుగా దేహదేహిభావమున
నెల్లవస్తువులును నీవెకాఁ దలఁచి
పరచింత లుడిగి నాపైనె విన్యస్త
భరుఁడవై యుండు శుభంబు లన్నియును

ననఘాత్మ నిన్నుఁ జెందు నని వరం బిచ్చి
జననివాక్యము ద్రోయఁ జనదు కుమార
పోయి రమ్మనిన నప్పుడు మేలుకాంచి
యాయచ్యుతునిఁ గొనియాడి మ్రొక్కుచును
జననియు దాను నిచ్చలుఁ దొంటిపురికిఁ
జనుదెంచి నిజనివాసముఁ బ్రవేశించె

## అన్నమయ పెండ్లి

నెలజవ్వనము మేన నిగుడొత్తుకొడుకుఁ
దలిదండ్రు లరసి యాశనిఁ దోడుకొనుచు
కులములవారింట్లకును బోయి సుతున
కెలమి మీాపడుచుల నీవలె నన్న
నేవేళఁ జూచిన నితఁడు శ్రీరామ
గోవింద హరి యనుకొనుచుండుఁ గాని
యలవోక సంసార మది యిచ్చఁ దనకు
వలె ననఁ డది యెటువంటిగొంటైన
నాచారములదాసరయ్యను జూచి
చూచి యేగతిఁ బడుచుల నిచ్చు ననిన
వారలకలలోన వారిజోదరుఁడు
దారియు మొనఁ జూపి తనదుభక్తునకు
నన్నయార్యునకుఁ గన్యకల నిమ్మనిన
నన్నన్న యని వారు నరు దందికొనుచు
తిరుమలమ్మను నొక్క తిరువాలుఁగంటి
నరుదైనయక్కలమ్మను నొక్క కన్య
బంగారు ప్రతిమలభావంబుఁ జూప
సింగార మొంటపుగాఁ జేసి మోదమునఁ

గ్రన్నన నాగమో_క్తప్రకారమునఁ
జెన్నుగాఁ బెండిండ్లు చేసి రంతటను
పరమేశుఁడగు నహోబలనృసింహుండు
గురుభావమునఁ జేరుకొని త్రిదండంబు
నానరసింహు చక్రాదిమంత్రములు
తానె ప్రత్యక్షంబు దయసేయఁగొనుచు
హరి హయగ్రీవుఁ బ్రత్యక్షంబుఁజేసి
ధరసర్వతంత్రస్వతంత్రుఁడై_నట్టి
వేదాంతదేశికు వెంకటాచార్యు
నాదివ్యసాంప్రదాయమున వ_ర్తించు
శఠకోపమునివద్ద సకలవేదాంత
పఠనంబుఁ జేసి యభంగవిస్ఫూ_ర్తి
హరిపూజ హరిసేవ హరికీ_ర్తనంబు
హరిమననము ధ్యాన మనిశంబుఁ దనకు
ఘనతరసకలభోగంబులుగాఁగ
మనుచు వాల్మీకిరామాయణ మెల్ల
రాగంబుతో ననురాగంబుతోడ
బాగుగా గంధర్వ బాగుగాఁ జదివి
పాటలన్నియుఁ దనపాటపిమ్మట దన
పాటపాటనె పాటపాడి చూపఁగను
విన్నవా రెల్ల నువ్విళ్లూరి యొక్క_
ప్రన్న వీనులు నిండువండువుల్ సేయ
తుంబురుఁడో నారదుఁడో కాక యావి
ధంబునఁ దిరుగు గంధర్వుఁడో కాక
మనుజుఁడో యీయున్నమయ యని సర్వ
జనులును గొనియాడి సంతసింపఁగను

## సాళ్వనరసింగరాయఁ డన్నమాచార్యు దర్శించుట

నావార్త విని విని యట్టిమహాను
భావునిఁ గన వాఞ్ఛ బడుచు డెందమున
నాచేర్వ టంగుటూ రను పురంబేలు
రాచమూకలలోఁ బరాక్రమశాలి
నాళీకబాంధవాన్వయుఁడు జేయుండు
సాళువ నరసింహజనపాలుఁ డొకఁడు
పరివారవాద్యసంభ్రమము రెట్టింప
కరమొప్పఁ జేకానికలు గొనివచ్చి
సూరితాళ్ల పాకాన్నమయ్యకు సాగి
చేతులు మొగిచి మచ్చికఁబూజ చేసి
శ్రీకృష్ణుమున్నఁ గ్రీడిభూచక్ర
మేకచక్రంబుగా నేలినపగిది
నాలాగు మీసహాయము నాకు గలుగ
నేలుదు ధరయెల్ల నేకచక్రముగ
నన్ను మన్నించి విన్నప మాలకించి
క్రన్నన మాయూరి కడ కేఁగుదెంచి
మాకు బుద్ధులు సెప్పి మాచేయుపూజ
చేకొని మమ్ము రక్షింపరే యనిన
సహజవైష్ణవభక్తి సలిపెడువాని
సహవాసమైన దోసములే దటంచు
నతఁడు పట్టించిన యందలంబెక్కి
యతఁడు భృత్యప్రాయుఁడై కొల్చిరాఁగ
చని టంగుటూరి కేశవమూర్తిఁ గాంచి

వినతుఁడై యతఁడు కోవెలదండఁ దనకు
సకలసంపదలతో సవరించియున్న
యొకపెద్దనగరిలో నొగిఁ బ్రవేశించె

నరసింగరాయఁడు విజయములందుట

నానాఁట నానరనాథుండు వేఱు
లేనికూరిమితోడ లీయమైయుండె
తనసంపదలు సమస్తము నన్నమయ్య
వని యెన్ను నడకల నారీతి నడచు
నేపని గలిగిన నెఱిఁగించికాని
చేపట్టి తనయంతఁ జేయఁ డెప్పుడును
హితునిఁగా గురునిఁగా నెల్ల బంధులఁగ
నతనినే భావించి యనుగవింపుచును
పావనుం డగుతాళ్లపాకాన్నమయ్య
దీవెన లంది వర్ధిలుచు నారాజు
బలియుఁడై పరిపంథిబలముల నడఁచి
నలిరేగి సింహాసనంబు చేకొనుచు
తనరాజధానియై తనరారుపసిఁడి
పెనుగొండ గతినుండు పెనుగొండ నుండి
యన్నమాచార్యుల నటకు రావించి
యెన్నిక నెదురుగా నేతెంచి మ్రొక్కి
కనకాంబరాదుల గ్రామసంతతుల
గనువారలకు దండగాఁ బూజ చేసి
యెన్నునిపై విన్నవించిన లోక
సన్నుతంబైన మీనసంకీర్తనములం

విన నాకు మిక్కిలి వేడు కయ్యెడును
ననఘాత్మ వినిపించు మనిన సద్గురుఁడు

## అన్నమాచార్యుఁడు సంకీర్తనములుపాడుట.

కెలనఁ జూపట్టుసంకీర్తనపరులఁ
బిలిచి లెస్సగ వినిపించఁగా వలయు
నిపు డన్న వారలు నెడఁ బాఱఁబాఱఁ
దిపిరిదండెలు శ్రుతుల్ తిన్నగాఁ గూర్చి
దండిమై నెఱగానదండెయు వాద్య
దండెయుఁ దానసంతానంబు చూప
స్థాయి షడ్జమును బంచమమును జేసి
తాయముల్ కడువింత డాలుగాఁ జూప
తేనెలపై తేట తిన్ననిచెఱకు
పానకముల నేరుపఱచినమేలు
చక్కెరలోతీపు చల్లఁదెమ్మెరలు
చిక్కనికపురంబు జీవరత్నములు
కలయమృతంబు మీఁగడ మీఁదిచవులు
చిలుకుచుఁ గవులెల్లఁ జేయెత్తి మ్రొక్క
వెంకటపతికిఁ గావించినమంచి
సంకీర్తనముల రసంబు లుట్టఁ గను
సింగార మొకకుప్పఁ జేసినరీతి
రంగైన రాగవర్ణములఁ బాడుటయు

## రాయలన్నమాచార్యుసత్కరించుట

తవిలి యొన్నినఁ గాళిదాసాదు లైన
కవులందుఁ జిక్కనకవులందు నిట్టి

కవితయు నిట్టిశృంగారభావంబు
వివరింపఁ గంటిమే వింటిమే మున్ను
కన్నవిన్నవి గావు గదర యీపదము
లన్నయార్యునివి మోహనమూర్తు లనుచు
వీనులవిందుగా విని చాల మెచ్చి
యానందవార్ధి నోలాడి యారాజు
పచ్చలకడియాలు బంగారుద్రాఁత
పచ్చడంబులును గెంబట్టుకుళ్లాయి
యంగదంబులు నుభయాతపత్రములు
రంగైనవింజామరలజోడు మంచి
యుదిరిచేసినగిండియును గళాచికయు
మొదలైన వెల్ల సమ్ముఖమున నొసగి
తనపెద్దనగరియొద్దనె యొక్కనగరు
ననువొందఁ జూపించి యట నుండఁ బనిచి
యనుదినంబును వేంకటాద్రీశువిూఁది
వినుతులు వేడ్కఁ వినుచుండి యుండె
నరనాథుఁ డట నొక్కనాఁ డన్నమార్యుఁ
బరిచరవర్గంబుఁ బంపి రమ్మనిన

రాయ లన్నమాచార్యుని మరలఁ బిలిపించుట

కనకాంబరునిగుణగణమణుల్ శ్రుతులు
గని చిక్కగొనురీతి గనుకపోలములు
నత్తటి మదిలోని హరికీర్తి కొలక
లొత్తినగతి నున్న యూర్ధ్వపుండ్రములు

కళ్లాయి. కుళ్లాయి-వ్రాఁతప్రతి.     గనకపోంగళ్లు-వ్రాఁతప్రతి.

లాలితాచ్యుతభక్తిలలన వహించు
మాలికగతి తిరుమణివడంబులును
తలనిడువిష్ణుపాదపుఁదమ్మిపువ్వు
మెలుపైనకెంబట్టుమేలుకుళ్లాయి
నరవిందనయనుకృపామృతధార
కరణిఁ జూపట్టెడుకంఠమాలికయు
నరహరికై కంకణము గట్టియున్న
కరణిఁ జూపట్టువచ్చలకడియములు
ధవళనేత్రుని శారదావిలాసంబు
నివసించు నట్లున్న నిలువుపేరణము
వాసుదేవునియాజ్ఞ వడిఁ జుట్టుకొన్న
యాసత్త్వగుణమన నలరుదుప్పటము
నలవడఁ జతురంతయానంబు నెక్కి
బలసి సంకీర్తనపరులు సేవింప
ఘనతరధవళశంఖధ్వాన మడరఁ
జనుదెంచి నృపతియాస్థానంబుచెంతఁ
బల్లకి డిగి వెంటఁ బరగువైష్ణవుని
నల్లన చెయూఁదియాలోని కరిగి
కూరిమిఁ దనరాక కోరి వీక్షించు
నారాజుఁ గదిసి నెయ్యముతియ్య మొదగ
సొలవక "శ్రీనివాసో రక్షు" తనుచు
నెలమిఁ జేతిరుమణి నిచ్చె నిచ్చుటయు
నెదురుగాఁ జనుదెంచి యెలమిఁజేకొనుచు
ముదమ్మున గరపద్మములు సాగి మ్రొక్కి

యన్నమాచార్యుతో ననుగు దీపింప
తిన్ననిపసిఁడిగద్దియమీఁద నుండి

## మరలఁ బాటలుపాడించుట

కవులు విద్వాంసులు గాయకుల్ భూమి
ధవులు సామంతులు దనుఁ జుట్టి కొలువ
నంగజగురుమీఁద నభినవంబైన
శృంగారయుతపదశ్రేణిఁ బాడింప
"చెలులార వేంకటశిఖరినాయకుని
కలికికిఁ గడగంటఁ గనుపట్టునెఱుపు
చెలువ మేగతి నుండెఁ జెప్పరే" యనిన
"నలువునఁ బ్రాణేశునాటినచూపు
నిలువునఁ బెఱుక నూనినశోణితంబు
తలపోయఁ గాదు గాదా" యన్నపదము
పలుమరుఁ బాడించి పాడించి చొక్కి
తలయూఁచి "యిది! కవిత్వం" బని మెచ్చి
యనుపమంబైనద్రోణాచార్యుమహిమ
గనియుఁ ద్రౌపదితండ్రి గర్వించినటుల
నన్నమాచార్యుమహాత్త్వ మంతయును
గన్నారఁ గనియును గర్వాంధుఁ డగుచు
పదరక వేంకటపతిమీఁద నుదువు
పదములరీతి నాపై నొక్కపదము
చెప్పుమా యనవుడుఁ జెవు లిరుగేల
నప్పళింపుచు మూసి హరిహరీ యనుచు
పరమపతివ్రతాభావంబుఁ బూని
హరిముకుందునిఁ గొనియాడు నాజిహ్వ

నినుఁ గొనియాడంగ నేర దెంతైన
నను నెట్లు పలికితి నైచ్యంపుఁబలుకు
నాయచ్యుతునిఁ దక్క నన్యుల వినుతి
సేయుట నాకన్న చెలియలి వావి

## సంకెలవేయించుట

నిను నొల్ల నిటువంటి నీపొందు నొల్లఁ
జనియెద వేంకటేశ్వరుఁ గొల్వ నేను
అనుచు దిగ్గనలేచి యరిగెడుగురుని
పనిఁబూని భటులచేఁ బట్టి తెప్పించి
తనబాల్యసఖ్యంబుఁ దలఁచి సంపదలఁ
దనయంతవానిఁగా దనరఁజేసితిని
గబ్బిమై నొకమాట కావలె నన్న
గొబ్బునఁ గోపించుకొన నేలవచ్చె
నీ వేమిసేయుదు నిను నింతసేయు
నావల్ల నేరము నను నింతసేసె
నని కనుఁగవ యెఱ్ఱనై నిప్పులురుల
ననుచరవర్గంబు నదలించి పిలిచి
లోఁగి నే నెంత దాళుచు వేఁడుకొనిన
లోఁగనిపుడమివేలుపుదంటకోడె
ఱంకెలు చన మూరురాయరగండ
సంకెల నిడి మొగసాలలో నిడుఁడ
యన నాడిగెలవార లాచార్యుఁ దోడు
కొనిపోయి మొగసాలఁ గూర్చుండ నిలిపి
కొంకుచు రాజానతిను భయంపడుచు

కంఠ లేవిధమ్ములేక సంకెలవేసి
కావలిడ్రె నలుగడ నుండి రంత
కోవిదుఁడై వ యగ్గురువరేణ్యుండు
మనమువ బ్రహ్మోదుండు మురవైరిఁ దలఁచి
దనుజబాధలఁ గాలఁ దన్నినకరణి
ఫణిరాజశైలేంద్రుఁ బ్రణతార్తిహారుని
గణుతించి హృదయపంకజవీధి నిలిపి
"సంకెల లిడువేళఁ జంపెడువేళ
సంకిలి ఋణదాత లాగెడువేళ
వదలక వెంకటేశ్వరునినామంబె
విదళించఁ గలిగాని వేఱొండు లేదు
మనమాలి యతఁడె నావగ పెల్ల నుడుపు"
వసుధర్మములతోడ వలవడియుండ
సంకలికాత్ముఁడై దరగువ నొక్క
సంకీర్తనముఁ జెప్పి శరణు సొచ్చుటయు
ఘల్లున వీడి శృంఖల లూడి గుండె
ఝల్లని చూచి యచ్చటవారు బెగడి
యావిధం బంతయు నారాజుతోడ
వేవేగఁ బ్రకటించి విన్నవింపుటయు
వసి వృత్తి సింహాసనము డిగ్గి నుతికి
పగశౌన్న బెబ్బులి పసిది నేతెంచి
అన్నమయార్యునిఁ జూచి యయ్యారో వద్ద
నున్నవారల కెల్ల నొగిలించి ఘంచి
వేయు వీసంకెళ్లు వీడె నటంచు
మాయురె నీ వెంతమాయవన్నినను

నేనేల పోనిత్తు నిది నిక్కమైన
నేనుండి తిరుగ వేయించెద నిప్పుడు
కిదుకక నీదుసంకీర్తనంబునకు
నది పీడెనా నిజం బని యెన్న వచ్చు
నీపాలిదైవంబు నిన్ను నీమహిమ
బాపురే యని మెచ్చి పాలింపఁ దగును
ననుచు నొద్దనె యుండి యానిగళంబు
తనికి చే నెత్తి యుద్దతు దేర మగుడ
నెకసక్కెమునకు వేయించిన గుర్రఁడు
నగి తొంటిసంకీర్తనము సేయుటయును
కాలినంకెల చిటికనవ్రేలిశలుము
చీలలు వీడి చెచ్చెర నూడి పడిన

## రాయలపశ్చాత్తాపము

పరికించి భూపతి భయ మంది యతని
చరణాబ్జములఁ జక్క సాగిలి మ్రొక్కి
కన్నీరు గదుర గద్గదకంఠుఁ డగుచు
పన్నిన దైన్య మేర్పడఁగ ని ట్లనియె
నపరాధి నపరాధి నన్నమాచార్య
కృపఁ జూడు ఘను నీవు కృపణశరణ్య
యెఱుఁగనిపసిబిడ్డఁ డైనఁ జేయు
నరుదైనతల్లికి నలుగంగఁ దగునె
నను నీవు చిన్నటనాఁట నుండియును
చేపడ బంటుగాఁ బనిగొంటి గనుక
మంచితనమున నీమహిమఁ జింతింప

కిందఱవలె నేన యిట్టు చేసితిని
వేంకటపతివి నీవే మాకు మనసు
శంక లింకించి ప్రసన్నుండ వగుము ః
నీవలిగిన నల్గు నీలవర్ణుండు
నీవు మెచ్చిన మెచ్చు నీరజోదరుఁడు
నాయర్థ మంతయు నన్నమాచార్య
నీయుండె కంటిమి నిక్కంబు గాఁగ
నని పట్టమహిషితో నతనిఁ గీర్తించి
పనిఁ బూని పన్నిటఁ బాదముల్ కడిగి
బంగారువిరులజొంపములఁ బూజించి
పొంగారువేడుక భూషణావళులఁ
జిత్రాంబరంబులఁ జిత్రవస్తువులఁ
చిత్రంబుగాఁగ భూషించి తోషించి
తనకుఁగా మును పాయితం బైనవసిఁడి
యనుసులచతురంతయాన మెక్కించి
భజయించి తనమూఁపు పల్లకికొమ్ము
నిజభుజంబున నిడి నెమ్మి గావింప

## అన్నమాచార్యుఁడు రాజు ననుగ్రహించుట

నది గని ముద మంది యన్నయార్యుండు
నదయుఁడై నృపతి నంజలిఁ బ్రస్తుతించి
మునుపటినీచేయు మొక్కలంబునకు
ననుతాపమును జెంది తది కారణమున
మునుకొన్నయపరాధమును తాళుకొనియె
దనుజారి యింక నింతట నుండి నీవు

నరహరిసంకీర్తనము సేయువారిఁ
బరసమానులుగాఁగఁ బరికింపవలదు
మురవైరి కృతయుగమున సర్వజనుల
నిరతనిజధ్యాననిష్ఠచే మెచ్చు
క్రతువులఁ ద్రేతాయుగమున నర్చనల
బ్రతిలేనియట్టిద్వాపరమున నలరు
నామూఁడుయుగముల ధ్యానాదివిధుల
నేమేమి నరులకు నిచ్చు నన్నియును
జలజోదరుఁడు నిజసంకీర్తనమునఁ
గలియుగంబున నిచ్చుఁ గావున నీవు
ప్రతిలేనివేంకటపతిమీఁద భక్తి
నతనిదాసులమీఁద నారీతిభక్తి
వదలక మను మని వరదుఁడై పలికె
నదిమొద లారాజు నఱలేనికూర్మి
సభయుఁడై యన్నమాచార్యు శేషాద్రి
విభునిఁగా నాత్మ భావింపుచు నుండె
సకలలోకములు నాచందాన గురుని
నకలంకగతిఁ గొనియాడంగఁ దొడఁగె
నారాజు వీడ్కొని యాదేశికుండు
నారాయణాచలనాథు సేవించి
శృంగారమంజరిఁ జేసి శేషాద్రి
శృంగవాసునకు నర్పించి యిచ్చుటయు
నాడుచుఁ బతకమా కన్నుల జోల
పాడఁగ నాఁ డెల్లఁ బసిబిడ్డనైతి
నాకృష్ణమాచార్యునధ్యాత్మవినుతి

రాకఁ గొన్నాళ్లు విరక్తుండ నైతి
జగతి నీశృంగార సంకీర్తనముల
నగపడి మంచిప్రాయపువాఁడ నయితి
నని వేంకటేశ్వరుఁ డన్నమాచార్యుఁ
గనుఁగొని వాత్రుచ్చి గారవించుటయు
వేదముల్ పొగడఁ గోవిదులు నుతింప
నా దేవతలు కొనియాడ గోవింద
నే నిన్నుఁ గొనియాడ నెంతటివాఁడ
కానేర్పు నీనేరు పరసి చూచినను
పలికెడువీణలో పలిచక్కఁదనము
పలికించునతనిదై పరగినరీతి
నని వినుతించి యయ్యంబుజోదరుని
దనుఁ గన్నతండ్రి నెంతయు మెచ్చఁజేసి
ప్రతివత్సరంబు తప్పక వృషభాద్రి
పతికిఁ గావించునా బ్రహ్మోత్సవములు
సేవించుకొనుచు నా శ్రీశైలనాథు
పావనవినుతిప్రభావంబుచేత
జగతిపై సకలవాచాశుద్ధి కలిగి
నగుచు నై నను దీవనల నిచ్చునేని
లలిమీఱఁ గినిసి యొల్లమిఁ దిట్టునేని
యల రెండు నపుడు ప్రత్యక్షమై చూపు

అన్నమాచార్యుని మహిమలు

నావరకృత్యంబు లన్నింటి లెక్క
గావింప నాకు శక్యమా నాఁటివారి

తెలుఁగుదు కవి పెద్ద తెలిఁగింప వినుచు
నెలఁగినకృతకృత్యు లిపుడును గలరు
అయిన సందొకకొన్ని యనఘమానసుల
వీనులవిందుగా విన్నవింతు నేను
మండెమురాయనాయకనరసింహ
దండనేతున కిష్టధనబలస్ఫూర్తి
ననువమంబుగ వేంకటాద్రిచెంగటను
తనయగ్రహారమై తనరుచునున్న
మరులుంకు (?) నొకజీడిమామిడి దాన
సరసంబు వోయినచవిపండ్లు పండు
నెఱనె గొప్పవై యేపారుపండ్లు
విఱివీఁగుచుఁ దనవీథి నెన్నడిమి
మినుకై నమంచిమామిడిచేరి నెదుటఁ
గనుపట్టు నాచెట్టుఁ గనిరొక్కనాఁడు
కపటమానసులయాకారంబు వోలె
నపుడెంతొ దృష్టప్రియంబులై యున్న
శ్రీమాధవునకు నర్పించి యాపండ్లు
తా మారగింప న త్తఱిఁ బండ్లు పులియ
నమృతంబు తోఁబుట్టు వగుపద్మవావి
నమృతంబు తనివోవ నానువెన్నునికి
నీఘోడ నెఱుఁగక యాజీడిపులుసు
కాయ లె ట్లొసఁగితిఁ గటకటా యనుచు
నాచెట్టు ముట్టితి నప్పయ్య దీన
నేచినదుర్గుణం బెల్లఁ బోఁజేసి.
ఇంపై నతియ్యమామిడిసేయు [illegible]

పంచదారలవంటిఫలముల దయ్యో
నానుద్దివిని రొక్కఁ డట పెండ్లియాడ
గాసువీసము నాకుఁ గల్గ దీపింపు
మన విని యటువలె నోఁగాక యనిన
వెనుకొని వాఁ డెన్ని వేఁడినఁ గాని
కాసువీసంబునే కాని యొక్కరుఁడు
చేసేత నొకరూక చేతిలో నిడఁడు
అది విని యది యొట్టిదని గాయకుండు
తదనుజ్ఞ మహిమగాఁ దలఁచి యేతెంచి
ఓతండ్రి నాపెండ్లి కొదవెడుధనము
చేతికి రా దయసేయవే యనుడు
నటువలె నోఁగాక యనిన నావిప్రుఁ
డట వీధి కేఁగెడునపుడు రా జొకఁడు
నాదరంబునఁ బిల్చి యడిగినధనము
ద్వాదశీకన్యకాదాన మిచ్చుటయు
నావార్త విని జను లరు దందికొనుచు
వావిరి నొడివలావళికిఁ గాఁ బొగడి
చెలువొందునాగురుశ్రీపాదరక్ష
తల నిడి తమయాపదల వీడికొనిరి

## అన్నమాచార్య పురందరదాసుల చెల్మి

గద్యపద్యముల డెబ్బదిరెండుమంది
యాద్యులచేఁ గొనియాడించుకొన్న
రసికుండు శ్రీపండరంగవిట్ఠలుఁడు
కొవరెడుభక్తి చేకూరఁజేసేత

నెనయ సంధ్యలకు నీ ళ్లియ్యఁ జేకొనుచుఁ
దనరుపురందరదాసాహ్వయుండు
పరమభాగవతుఁడై పరగుచు నంద
వరకులాగ్రణి యైనవైష్ణవోత్తముఁడుం
సవరించు మురవైరిసంకీర్తనములు
కువలయంబునఁ బేరుకొన్నమాత్రమున
తలఁచినభూతబేతాళపిశాచ
ములు పాఱిపోవ నిమ్మల శుభం బెనగ
విని కనియును లోన వెఱఁ గందికొనుచు
చని తాళ్లపాకశాసనుఁ డన్నమయ్య
వెన్నునిఁ గాన భావించి కీర్తించి
సన్నుతిసేయు నాచార్యవర్యుండు
నతని విట్ఠలునిఁగా ననయంబు దలఁచి
ప్రతిలేనిగతుల సంభావించె నపుడు
నీరీతిమహిమ లనేకముల్ వెలయ
వారక పరభాగవతులు గీర్తింప

## అన్నమాచార్యులరచనలు

యోగమార్గంబున నొకకొన్ని బుధులు
వైరాగ్యరచనతో వ్రాసిరఁ గొన్ని
రాగిల్ల శృంగారరసరీతిఁ గొన్ని
సారసనేత్రుపై సంకీర్తనములు
పరతత్త్వమునఁ దాళవమ్ఖముల్ తాఁగ
పరమంత్రములు ముప్పదిరెండువేలు
ప్రవిమలద్విపదప్రబంధరూపమున

వవముగా రామాయణము దివ్యభాష
నావేంకటాద్రిమాహాత్మ్య మంతయును
గావించి రుచుల శృంగారమంజరియు
శతకముల్ పదిరెండు సకలభాషలను
ప్రతిలేనినానాప్రబంధముల్ చేసి

## అన్నమాచార్య సంతతి.

సిరివరు మెప్పించి చెలఁగి యాదేవు
వరమున దనయంతవారిఁ బుత్రకుల
నరనయాచార్యు నున్నతయశోధనుని
తిరుమలాచార్యుని ధీవిశారదుని
గాంచి వారును దనకరణి విద్యలను
గాంచనాంబరుభక్తిఁ జలిమిఁ బెంపొంద
శౌరికథాసుధాసల్లాపగరిమ
ధారుణి నెంతయుఁ దనరారుచుండె
మనమునఁ గపటంబు మాని సద్భక్తి
ననఘమౌ నీయన్నమాచార్యచరిత
వినిన వ్రాసినఁ బేరుకొనినఁ జదివిన
జనులకు నిష్టార్థసౌఖ్యంబు లొదవు
నని యలమేల్మంగాధీశు పేర
నినమండలాంతరాహితమూర్తి పేర
హరిపేర దరచక్రహస్తుని పేర
ధర నన్నమాకులదైవంబు పేర
నాలీలఁ దాళ్ళపాకాన్నమాచార్యు
నేలిన శ్రీ వేంకటేశ్వరు పేర

సంకితంబుగను శ్రీహరిభక్తపాద
పంకజార్చక తాళ్ళపాకాన్నమార్య
తనయ తిమ్మార్యనందన రత్నకుంభ
దనుపమశ్రీవేంకటాధీశదత్త
మకరకుండలయుగ్మమండితకర్ణ
సకలవైష్ణవపాదసంసేవకాబ్జ
సదనావధూలబ్ధపరసకవిత్వ
విదితమానస తిరువేంగళనాథ
[1] విరచితసద్భక్తివిభవాన్నమార్య
చరితంబు జగదేకసన్నుతంబగుచు
నాచక్రశంఖాంకయతిమతోఁగూడ
నాచంద్రతారార్కమై యుండుఁగాత.



1 విరచితం [illegible]న్న మాచార్య-వ్రాతప్రతి.

---

1 సంపంగిప్రదక్షిణము, విమానప్రదక్షిణము, వైకుంఠప్రదక్షిణము నను ప్రదక్షిణత్రయములలో నిది మొదటిది. పూర్వమిందు సంపంగిచెట్లుండెడివిగాఁబోలును. స్వామికి ప్రసుగంధము సోకునట్లుగా నాచెట్లు ప్రదక్షిణము చేయుచుఁ దిరుగుచుండెడివట. సంపంగి ప్రమాఁకులు జరగించుటలు గాపురిపులపాశెముబు దర్శించు పగలు" అని వెంకటాద్రివిహారిశతకమునను, "దండిగ సంపంగిమాఁకులు నడిపించదైవరాయ తెలిశి మీవిద్యలు" అన్నమాచార్య-సంకీర్తనము (చూ. పీఠిక 25 పుట) నను గలదు.

2 మోఁకాళ్ల ముడుపునకుఁ బూర్వమున్నది.

3 ఇది పెదతిరుమలాచార్యుని నాఁటినుండి తాళ్లపాకవారిదే. ఇంటెదురుగనున్నట్టు ఇటీవల శిరిగొండ వెంకమాంబకు దానము చేయబడినది. కుడిపట్టు ద్వాదశి మండపము. దీనిని నేఁడు గద్వాల రాణిగారు సంపాదించినారు.

4 ఈచింతచెట్టుఅడిపడికిక్రిందనున్నది.

5 దీని లోతట్టున సాళ్వ నరసింహరాయల శాసనమున్నది. ఇది విమానప్రదక్షిణమున నుత్తర పార్శ్వమున నున్నది. (దీనినిఁగూర్చి చూ. పీఠిక పుట 90.) అన్నమాచార్య పెదతిరుమలాచార్యుల విగ్రహము లీయఱబైటి శిలామధ్యమునఁ జెక్కఁబడినవి. చార్యుకుడివైపుది పెదతిరుమలాచార్యులది. అర యెడమవైపుది యన్నమాచార్యునిది.

## LIST OF SRI VENKATESVARA ORIENTAL INSTITUTE PUBLICATIONS

*Sri Venkatesvara Oriental Series :—*

| No. | Title | Rs. | A. | P. |
|---|---|---|---|---|
| 1. | Sri Venkatesvara Kavya Kalapa, Ed. by Sri D. T. Tatacharya ... | 4 | [illegible] | 0 |
| 2. | History of Tirupati, Vol. II by Dr. S. Krishnaswami Aiyangar ... | 3 | 0 | 0 |
| 3. | A Glossary of Indian Philosophical Terms, by Sri C. V. Sankara Rao ... | 1 | 8 | 0 |
| 4. | Psychology (in Telugu) by Dr. K. C. Varadachari. | 2 | [illegible] | 0 |
| 5. | Isavasyopanishad Bhashya, of Venkatanatha Ed. with English Translation by Dr. K. C. Varadachari and Sri D. T. Tatacharya ... | 2 | [illegible] | 0 |
| 6. | Samurtarchanadhikarana (Atri Samhita) Ed. by Sri P. Raghunatha Chakravarti Bhattacharya and Sri M. Ramakrishna Kavi ... | 5 | 0 | 0 |
| 7. | Suvarnasaptati, Ed. by Sri N. Aiyaswami Sastri. | 5 | [illegible] | 0 |
| 8. | Kenopanishad Bhashya of Rangaramanuja Ed. with English Translation by Dr. K. C. Varadachari and Sri D. T. Tatacharya ... | 2 | 0 | 0 |
| 9. | Tirukkural-Kamattuppal with two old Commentaries Ed. by Sri T. P. Palaniappa Pillai ... | 4 | 0 | 0 |
| 10. | Sri Venkatesvara Vachanamulu, Ed. by Sri V. Prabhakara Sastri ... | 1 | 8 | 0 |
| 11. | Sringara Sankirthanamulu by Tallapaka Annamacharyulu. IV Volume of Tallapaka Works Ed. by V. Prabhakara Sastry ... | 2 | 0 | 0 |
| 12. | Kasyapa Jnanakanda (Kasyapa Samhita) Ed. by Sri R. Parthasarathi Battachar ... | 5 | 0 | 0 |
| 13. | Andhra Kuvalayanandamu by Ubhaya Bhasha Pravina K. Subramanya Sastri ... | 3 | 12 | 0 |
| 14. | Tirukkural-Porutpal with the commentaries of Kalingar and Parippérumal Edited by Sri T. P. Palaniappa Pillai ... | 4 | 0 | 0 |
| 15. | Kathopanishad Bhashya of Rangaramanuja Ed. with English Translation by Dr. K. C. Varadachari and Sri D. T. Tatacharya ... | 3 | 12 | 0 |
| 16. | Sri Venkatesvara Laghu Kritulu, Ed. by Sri V. Prabhakara Sastri ... | 1 | 8 | 0 |

*Sri Venkatesvara Oriental Institute Studies :—*

| No. | Title | Rs. | A. | P. |
|---|---|---|---|---|
| 1. | Theory of Knowledge in the Philosophy of Sri Ramanuja by Dr. K. C. Varadachari ... | 3 | 0 | 0 |
| 2. | Rupakaparisuddhi by Sri D. T. Tatacharya ... | 2 | 0 | 0 |

*Copies can be had of :—*

THE DIRECTOR
S. V. ORIENTAL INSTITUTE,
TIRUPATI (CHITTOOR DT.) S. INDIA.